REGD. No. HNL 18   ESTD 1930   21-6-1991   శుక్రవారం   సంపుటి: 62   సంచిక: 25   రు. 1-50 లు

# జమీన్‌రైతు

సంస్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకులు: నెల్లూరు డోలే ప్రసాద్

'గురుశిష్యులు' ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డి, ప్రధాని పి. వి.

# ప్రతి తెలుగు ఎద పులకించిపోతూంది!

భారత ప్రధానిగా శ్రీ పి. వి. నరసింహారావు ఏకగ్రీవంగా ఎన్నికైనాడు.

భారత ప్రధాని పి. వి.

దేశ రాజకీయ చరిత్రలో ఇదొక మహత్తర ఘట్టం. ఇప్పటివరకు ఉత్తర భారతం ఎల్లలదాటి వెలుపలకురాని అత్యున్నత అధికార పీఠం ఇది. ఎనిమిదిమంది మాజీ ప్రధానులూ అక్కడివారే. చరిత్రలో తొలిసారిగా వింధ్యపర్వతాలు దాటివచ్చిన ఈ అత్యున్నతపదవిలో ఒక తెలుగువాడు ఆసీనుడుకావడం ఆరుకోట్ల ఆంధ్రుల ఎదలు పులకించే మహోత్కృష్ట సన్నివేశం. గురువారం మధ్యాహ్నం 12 గంటలకు, శుక్రవారం దశమి ఘడియల్లో శ్రీ పాములపర్తి వెంకట నరసింహారావు సువిశాల భారతదేశానికి మకుటంలేని చక్రవర్తిగా పదవీస్వీకారం చేశారు.

రాజకీయాలలో పదవ కాంత ఎప్పుడు ఎవ్వరి ఒడిలో వచ్చి వాలుతుందో ఎవరూ కనిపెట్టలేరు. ఇరవయ్యేళ్ళ క్రితం ముఖ్యమంత్రిగా పనిచేసినప్పటి నుంచి ఇందిరా కుటుంబానికి అంతరంగిక సలహాదారుగా, తెరవెనుక నాటక సూత్రధారిగా

క్యాబినెట్ మంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి

వుంటూ రాముకాక మీద సీటెక్కొట్టుచుందంగా కాలంగడుపుతుండిన శ్రీ పి.వి. ఉన్నట్టుండి ప్రధానమంత్రి కావడం అదృష్టం తప్ప మరేమీకాదు. ఇందిరా, రాజీవ్‌ల క్యాబినెట్లలో రెండవ స్థానంలో వున్నప్పటికీ, ప్రథమస్థానానికి ఎగబ్రాకాలని ఎప్పుడూ ప్రాకులాడలేదు పివి. నంబర్ 9, మోతీలాల్ నెహ్రూమార్గ్‌నే తన శాశ్వత నివాసంగా చేసుకొని నెహ్రూవంశానికి విధేయుడైన గౌరవ సలహాదారుగామాత్రమే వుండిపోవాలని వాంఛించేవారు. ఇందిరాగాంధీకి, రాజీవ్‌కు తప్ప మరొక నాయకుడితో సన్నిహితంగా మెలిగేవారు కాదు. తనకంటూ ఒక గ్రూపు ఏర్పరచుకోవాలనిగాని, అనుచరులను పెంచుకోవాలనికాని ఎప్పుడూ ఆసక్తిచూపలేదు. రాష్ట్ర రాజకీయాలలో ఏనాడూ ప్రత్యక్ష జోక్యం కల్పించుకోలేదు. మొత్తం ప్రజాజీవితంలో ఒక్కనాడైనా ఏ ముఖ్య అనుచరుడికీ రాజకీయ పరమైన సిఫారసుచేయనివ్యక్తి ఆయన. అందువల్లే ఆనాడు పార్లమెంటరీ పార్టీ నాయకత్వ ఎన్నికకు పోటీకిదిగితే ఒక్క ఎ.పి. గూడా వేలెత్తిచూపలేక పోయారు. చిన్న అభ్యంతరం చూపలేక పోయారు. భారతరాజకీయాలలో ఉన్నత పదవులన్నీ అధిరోహించినా వివాదరహితుడుగా, మచ్చలేని నాయకుడుగా మిగిలిన ఒకేఒక కాంగ్రెస్‌వాది శ్రీ పి.వి.యే అవుతారు. మొరార్జీదేశాయ్ వంటి నీతి వంతుడుకూడా వివాదాల్లో చిక్కుకున్నవారే!

శ్రీ పి. వి. మహోన్నత 16 భారత

స్టేట్ మంత్రి చింతా మోహన్

భారతదేశ శాసనంలో పొందుపర్చారు.

—రెండవ 9 పేజీలో

జమీన్‌రైతు

# కళ్ళుతెరవాలి

దేశంలో, రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ పూర్తిస్థాయి ప్రజాదరణను పొందలేకపోయింది. ప్రజలు కాంగ్రెస్‌ను తిరస్కరించనూ లేదు, తిప్పి నెత్తిన పెట్టుకోనూలేదు. కాంగ్రెస్‌ను అభిమానించాలా లేక ఆగ్రహపడాలా అన్న ద్వైదీభావసమస్యతో ఊగిసలాటలో పడిపోయారా అనిపిస్తున్నది.

రాష్ట్ర, దేశస్థాయి ఎన్నికల ఫలితాలను విశ్లేషిస్తే, ఒక్క మహారాష్ట్రలో తప్ప మరేప్రాంతంలోనూ ఓటర్లు కాంగ్రెస్‌ను అభిమాన పార్టీగా ఆదరించలేదు. ఇతరపార్టీలపై విరక్తితోనో, భయంతోనో పడిన నెగటివ్ ఓట్లతోనే కాంగ్రెస్ అధికశాతం సీట్లు సంపాదించింది. ఇంకొకప్రక్క దేశంలోని కొన్నిప్రాంతాలలో కాంగ్రెస్‌పట్ల ఆగ్రహంతో ఇతరపార్టీలను ఆదరించారు ప్రజలు.

ఆంధ్రప్రదేశ్ విషయంవరకు చూసినా, కాంగ్రెస్ ఆత్మపరిశీలన చేసుకోవలసివుంటుంది. రాజీవ్ హత్యకుముందు జరిగిన 17 సీట్ల ఎన్నికల్లో, గెల్చింది మూడంటేమూడు. ఏడాదిన్నర క్రితం ఈపదిహేడింటిలోనూ కాంగ్రెస్ విజయం సాధించింది. ఇంత స్వల్పవ్యవధిలో ప్రజలు ఆనాడు ఈసడించుకున్న తెలుగుదేశం పార్టీకి తిరిగి ఎందుకు పట్టంకట్టారు? ఈ మార్పుకు కారణమేమిటన్నది ప్రతి కాంగ్రెస్‌వాదీ ఆలోచించవలసిన విషయం. రాజీవ్ ఆత్మార్పణంతో ప్రజల్లో పెల్లుబికిన సానుభూతివల్ల తక్కిన 25 స్థానాలలో పార్టీ పరువుదక్కిందిగాని లేకుండే రాష్ట్రంలో కాంగ్రెస్ పరిస్థితి వేరుగావుండేది. పార్టీకి విధేయులు, ప్రజల్లో పలుకుబడిగల్గిన కార్యకర్తలు, నాయకులను విస్మరించినందువల్ల కల్గిన దుష్ఫలితం ఇది. 1989 లో డాక్టర్ ఎం. చెన్నారెడ్డిని ముఖ్యమంత్రిగా చేసిన పాపం, పార్టీని ఈనాడీరూపంలో శాపగ్రస్తం చేసింది.

ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో రాజీవ్ హత్య సైతం ఈషణ్మాత్రం కరుణ, సానుభూతి కల్గించలేకపోయాయంటే, ఆ రాష్ట్రాల ప్రజలు కాంగ్రెస్‌పట్ల ఎంత విసిగిపోయివున్నారో అర్థంచేసుకోవచ్చు. దేశం సుస్థిరత కోరుతున్నా, జనతాదళ్ ప్రయోగం విఫలమైనా, తిరిగి ఆ పార్టీనే వరించారుతప్ప కాంగ్రెస్‌ను కన్నెత్తి చూడలేదు.

కేంద్రంలో అధికారంలోకి రాబోతున్న కాంగ్రెస్ నాయకులు ఈ వాస్తవపరిస్థితి గుర్తించి మెలగవలసిన అవసరం వుంది. పట్టి మాటలతో ఎల్లకాలం ప్రజలను మంచిచేసుకోవడం అలివయ్యేపనికాదు. ప్రతి కాంగ్రెస్‌వాదీ కళ్ళురెండూ తెరిచి, రాజకీయపరిస్థితిని విశదంగా పరికించి, ప్రజలకు తమకు మధ్య అగాధం ఎందుకు ఏర్పడిందో గ్రహించి, సాన్నిహిత్యం పెంచుకోవడానికి కంకణధారులు కావాలి.

రాజీవ్ హత్యతో, కాంగ్రెస్‌కు జాతీయస్థాయి గుర్తింపుకల్గిన నాయకుడే లేకుండాపోయాడు. ఓటర్లను తమ ఆకర్షణశక్తిద్వారా సమ్మోహితులను చేసేవారెవరూలేరు. ఈ పరిస్థితులలో గ్రామస్థాయి నుంచి ఢిల్లీవరకు క్రమశిక్షణ కల్గిన కార్యకర్తలు, పనిచేసే పార్టీ యంత్రాంగం రూపొందితేతప్ప ఒకపార్టీగా కాంగ్రెస్ ఎక్కువకాలం నిలవలేదు. అడ్‌హాక్ నియామకాలతో కాంగ్రెస్ కమిటీలు, రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పడే సంస్కృతికి తిలోదకాలివ్వక తప్పదు.

అవినీతి, ఆశ్రితపక్షపాతం విడనాడడం కూడా అత్యవసరం. ఇంతకాలం క్రిందిస్థాయిలో నాయకులెన్ని తప్పులుచేసినా, ఎంతటి అవినీతిపరులైనా ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీలనుచూసి ప్రజలు ఓట్లు వేసేవారు. ఇప్పుడు పరిస్థితి మారింది. ఏ నాయకుడు తప్పుచేసినా, దాని ప్రభావం పార్టీ మొత్తంపై పడుతుంది.

కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వాలు ఢిల్లీనేతలకు కాకుండా, ప్రజలకు జవాబుదారీగా వుండవలసిన తరుణమిది. చీటికిమాటికి ముఖ్యమంత్రులను మార్చడం, మంత్రివర్గ శాఖల మార్పుకు కూడా ఢిల్లీకి పరుగెత్తడం మానాలి. శాసన సభ్యులకు విలువనిచ్చి, శాసనసభా పార్టీ సూచనలను శిరసావహించి ప్రభుత్వాలు నడపకుంటే, ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ కుక్కచింపినవిస్తరి అవుతుంది.

కాంగ్రెస్‌ను ఒక ప్రజాస్వామ్యయుత రాజకీయపార్టీగా తీర్చిదిద్దే కృషిలో ప్రతి కాంగ్రెస్‌వాదీ నడుంబిగించకుంటే, పార్టీకి భవిష్యత్ వుండదు.

జమీన్‌రైతు
20-6-1941
10 పేజీలు అణా

## రంధ్రాన్వేషి హిందూ పత్రిక

రష్యా మహాకవి ప్రాష్కిన్‌కి పెద్ద విప్లవ సామాజికుడు. ఇంక 20 మందితోగూడా మరణశిక్షవేసి వధ్యశిలప్రాంత నగ్నాంగులుగా అందరినీ నిలబెట్టినారు. ఒకరివెంబడి ఒకరిని వరుసగా మనకవి పక్కవాని శిరం కూడా తన కండ్లెదుటే ఎగిరిపోయింది. ఇంతలో ఒక రౌతు కొనవూపిరితోవచ్చి గుర్రందిగి ఇంక తంపక వదిలివేయమని ఆజ్ఞాపత్రం దండనాధికారి కిచ్చాడు. ఇది విని మిగిలిన ఖైదీలలో ఇద్దరు అట్లనే మరణించారు. ప్రాష్కిన్‌కి పిచ్చిఎత్తి దేశాలుతిరిగి భగ్న హృదయంతో మరణించాడు చివరకు.

అట్లనే మొన్నటి ఆంధ్రా యూనివర్శిటీ ఎస్. ఎస్. ఎల్. సి పరీక్షాఫలితాల ప్రకటనలో హిందూ పత్రిక మొదటిదినం కొన్ని నంబర్లు వేసింది. ఆ నంబర్లుగలవాళ్ళు దేవుడికి టెంకాయలు కొట్టివుంటారు. మరుదినం ఒక సవరణ వచ్చింది దానిలో "నిన్నటి నంబర్లు తప్పు అని వాటిలుమరి కొన్ని కొత్తనంబర్లు చదువుకోండి" అని తెలిపింది. చూడండి పాపం! ఎందరు పిల్లకాయలు బాధపడినారో!

## 50 ఏళ్ల క్రితం ఈ వారం

### జైలులో మరియన్న చావు

రామవరపు మరియన్న గత 9 తేది సాం నెల్లూరు కపాడిపాళెంలో సత్యాగ్రహం చేయగా అరెస్టు చేసిరి. 19 తేది వరకు రిమేండు ఇవ్వబడి నెల్లూరు సబ్ జైలులో నుంచబడెను. 18 తేది అర్ధరాత్రివేళ లాకప్‌లో వున్న మరియన్నకు కలరా తగిలింది 20 పర్యాయములు బేధి వాంతి జరగగా జైలు వార్డర్లుకు పీమ కట్టినట్లయినా లేదట. తర్వాత పెద్దాస్పత్రికి చేర్చగా నాడి గండి రాత్రి 10 గంటలకు చనిపోయినారు.

ఈ చిన్న హృదయ విదారక కృత్యానికి కారకులైన జైలుఅధికార్ల దర్యాప్తు చేయవలెనని డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుగారు విచారించిరి గనక కర్తవ్య మనవాడు.

### కళ్యాణరావు కుమార్తె నిర్యాణము

కటికనేని కళ్యాణరావుగారి ప్రథమ తనయ ప్రసవ గండంతో మరణించిందన్న విషాదవార్త ఇప్పుడే విన్నాం.

కాంగ్రెసు, జమీన్ రైతు ఉద్యమాలలో దెబ్బతిన్న కటుంబాలలో యిది ఒకటి. 1931 ప్రాంతంలో కటికనేని వారనేవారేలేకపోతే కాంగ్రెసు ఉద్యమమనే మందారమొలక వెంకటగిరిలవు అనే స్మశానవాటికలో మొలవనే మొలవదు. 1931 జమీన్‌రైతు ఉద్యమమనే జాలిగను వెంకటగిరి క్షేత్రములో నిలువనీడ దొరికేవుండదు. కావున కటికనేనివారి ఆశీర్వాదానికి వెంకటగిరి పౌరులు, రైతులు సదా కృతజ్ఞులై యుండక తప్పదు. కటికనేని సోదరులలో కళ్యాణరావుగారు చాలా మంచివాడు. సుస్వభావి. కపటమెరుగని వ్యక్తి. వీరికి కలిగిన ఈ విపత్తుకు మా సంతాపం తెలుపుతున్నాము.

## కాంగ్రెస్ గూండాల పరమైపోతూంది

కాంగ్రెస్‌పార్టీలో నిజాయితీ, సంస్కారం కల్గిన నాయకులు ఒక్కొక్కరే అంతరిస్తున్నారు. మిగిలిన వారు తెరమరుగౌతున్నారు. యువతరంపేరుతో గూండాలు, అరాచకవాదులు ఆ స్థానాలాక్రమిస్తున్నారు. వంద సంవత్సరాల చరిత్ర కల్గిన పార్టీ, అత్యున్నత ఎంపికలో దిగ్గింగు చేయగల్గినవారిని, ప్రత్యర్థులను మట్టుపెట్టి అయినా గెల్చుకొని రాగల్గినవారిని వెతుక్కొనే దుస్థితికి దిగజారిపోతున్నది. సినిమాహాళ్ళ దగ్గరుండి తగలబెట్టించేవారు ఎమ్మెల్యేలౌతున్నారు.

కాంగ్రెసుకు పట్టిన ఈ శని ఎప్పుడు వదులుతుందో, తిరిగి పాతతరంనాటి ప్రాభవం ఎప్పుడు దక్కుతుందో తెలియడంలేదు. పార్టీ చిన్నాభిన్నమైపోయేలోగా పార్టీకి పునర్వైభవం కల్గించే నాయకులు రావాలి.

— ఒక కాంగ్రెస్ అభిమాని

### కత్తిశాఖ లంచాలు- పల్లెల్లో బాధలు!

ఆహారంలో కల్తీ నిరోధించే ఇన్స్పెక్టర్లు గ్రామాలలో చిన్న చిన్న అంగళ్ళపైబడి లంచాలకోసం పీకుతున్నారు. పల్లెటూళ్ళలోని చిన్న వ్యాపారులు సాధారణంగా నిరక్షరాస్యులై వుంటారు. వీరు పట్టణాల నుంచి తెచ్చిన వస్తువులు అమ్ముతారేతప్ప, స్వంతంగా తయారుచేయరు. కాని ఫుడ్ ఇన్స్పెక్టర్లు మాత్రం టౌన్లలోని పెద్ద వ్యాపారులదగ్గర నెలమామూళ్ళు దండుకొని, వారి జోలికి పోకుండా, కేసులుపెట్టినట్లు చూపించుకోవడానికి పల్లెలమీద పడుతున్నారు. ఏ రోడ్డు ప్రక్కన చెట్టుక్రిందో తినుబండారాలమ్మే చిరువ్యాపారిని వందల్లో లంచాలిమ్మంటే ఎట్లా ఇవ్వగలరు? ఇంత నీచానికి దిగజారుతున్న ఫుడ్ ఇన్స్పెక్టర్లను ఉన్నతాధికారులు అదుపుచేయాలి.

— ఒక బాధితుడు.

### ఇంత ద్రోహమా?

వల్లపరెడ్డి శ్రీనివాసుల రెడ్డిగారు మొన్నటి ఎన్నికలలో కాంగ్రెసుపార్టీకి చేసిన ద్రోహం క్షమించరానిది. రాజీవ్ గాంధీ ప్రధాని అయ్యేవరకు నిద్రపోవనన్న ప్రతిజ్ఞలు చేసిన పెద్దమనిషి రాజీవ్‌గాంధీ కాంగ్రెసుకు టికెట్ ఇవ్వకపోయేసరికి వెన్నుపోటు పొడిచాడు. నాయుడు, కాపుడు నియోజకవర్గంలో శ్రీనివాసులురెడ్డిగారి అనుచరులు పార్టీ ఓటమికి ఎంతతీవ్రంగా పనిచేసిందీ ఎన్నికల ఫలితాలు చెప్తున్నాయి. వారి అనుచరులు స్పష్టంగా




వున్న ప్రతిగ్రామంలోనూ తెలుగుదేశంకి మెజారిటీ వచ్చింది.

తన అనుచరుడికి టిక్కెట్ ఇవ్వనంతమాత్రాన, తనకు పదవిని, అధికారాన్ని ఇచ్చిన పార్టీకి ద్రోహంచేసే నీతులను కాంగ్రెసులో కొనసాగనివ్వడం ఘోరమైన అపచారం. ఇటువంటి నయవంచకులను ఎంతత్వరగా వదిలించుకుంటే పార్టీకి అంత శ్రేయస్సు.

కోవూరు — డి. రామిరెడ్డి

### పివికి అభినందనలు

కాంగ్రెస్ పార్టీ పార్లమెంటరీ పార్టీ నాయకుడుగా ఎన్నికై, రేపో మాపో ప్రధానికాబోతున్న తొలి ఆంధ్రుడు శ్రీ పి వి నరసింహారావుగారిని మనసారా అభినందిస్తున్నాము. ప్రతి తెలుగువాడూ గర్వంతో ఛాతీ విరుచుకొని తిరగవలసిన సంఘటన ఇది. దేశంలోని అత్యున్నత అధికారపీఠం ఉత్తర భారతీయులకేసొంతం అన్న సాంప్రదాయాన్ని భగ్నం చేసిన శ్రీ పివికి మనఃపూర్వక అభినందనలు.

నెల్లూరు — ఎన్. కామేశ్వరరావు

మూడుస్థానాల్లో కాంగ్రెస్‌అభ్యర్థుల ఘనవిజయంతో

# ముఖ్యమంత్రి ప్రతిష్ఠ ఇనుమడించింది!

నెల్లూరు జిల్లాతో సంబంధం వున్న మూడు నియోజకవర్గాల్లోనూ కాంగ్రెసు అభ్యర్థులే గెల్చారు. గెల్చిన మొగ్గ రూ నెల్లూరియులే! మొగ్గు'డి ఆలంచనీయుడు. కేంద్రమంత్రి ఎన్. టి. రామారావు పెద్దమంత్రి వేషాలకు ఇంకా విలువనిచ్చి, మాయాజాలంలో మునిగిపోయినా, కోస్తా ఓటర్లు వున్నా ఈ మూడు నియోజకవర్గాల ఓటర్లు మాత్రం కాంగ్రెసువల్ల తమ అభిమానాన్ని, అనురక్తిని విడనాడలేదు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి

కె. పద్మశ్రీ

ప్రతిష్ఠను నిల్పిన నియోజకవర్గాలూ ఇవే. మూడింటిలోనూ ముఖ్యమంత్రి వ్యక్తిగత ప్రతిష్ఠ ఇమిడివుంది; మూడింటిలోనూ విజయం సిద్ధించడంతో గెల్చినవాడు వేరెత్తిచూపడానికి లేకుండాపోయింది.

నెల్లూరుకు సంబంధించి కాంగ్రెసు అభ్యర్థిని కుమారి పద్మశ్రీ 44,857 ఓట్ల మెజారిటీతో గెల్చింది. నామినేషన్ వేసిన నాడే విజయం నిర్ణయమైపోయిన నియోజకవర్గం ఇది. నెల్లూరు ఓటర్లపట్ల అందరికీ విశ్వాసం వుండబట్టే, నల్లపరెడ్డి శీనయ్య మంత్రివారులెక్కలేరని తెలిసినా పార్టీ పట్ల విధేయత విశ్వాసం కూడా లేని పుచ్చలపల్లి పై చలయ్యను మార్చి, రాజకీయాలకు కొత్తె అయిన కుమారి కె. పద్మశ్రీని రంగంలోకి తెచ్చారు జనార్దనరెడ్డి. ఈ మార్పుకు ప్రజల ఆమోదం లభించింది.

పోలింగ్‌నాటి అంచనాల ప్రకారం నెల్లూరులో పద్మశ్రీ కనీసం 60 వేల మెజారిటీతో విజయం సాధిస్తుందని భావించారు. ఆ అంచనాకు ఐదువేలమాత్రమే తగ్గింది ఆధిక్యత. తెలుగుదేశం పార్టీకి అనుకున్నదానికంటే ఓట్లు పెరగడం, బిజెపికి ఆశించినదానిలో సగం కూడా రాకపోవడం ఈఎన్నికలలో పెద్దవిశేషం. ఎలక్షన్‌ఆర్భాటాలను చూస్తే ఎక్కడచూసినా బిజెపియే కన్పించింది. ప్రచారార్భాటంలో కాంగ్రెసు సైతం వారితో పోటీ పడలేకపోయింది. ఇల్లిల్లూ తిరిగి ఓటు అడగడంతోపాటు, కన్పడిన ప్రతి మహిళకూ సీతమ్మవారి కుంకుమ పంచి పెట్టారు. బిజెపి ఎన్నికల ఏజంటులేని పోలింగ్‌బూత్ నియోజకవర్గం మొత్తంమీద ఎక్కడాలేదు. కాని చివరికొచ్చేసరికి కూరలో అప్పటం తప్ప ఉప్పులో ఏదులేదన్నట్లయింది పరిస్థితి. కనాకష్టంగా డిపాజిట్ మాత్రం దక్కించుకున్నారు.

తెలుగుదేశానికి 2 లక్షలా పైచిలుకు ఓట్లు రావడం ఆశ్చర్యంగొల్పే పరిణామం. ఎన్. టి. రామారావు నెల్లూరు సభలు చూసినతర్వాతకూడా, ప్రజల్లో ఆపార్టీ పట్ల అంతటి అభిమానం మిగిలివుందన్న ఊహకూడా కలుగలేదు. వారి ఎన్నికల ప్రచారంసైతం నిస్తేజంగా జరిగింది. అభ్యర్థిని డాక్టర్ ఎం. నాగభూషణమ్మను పట్టించుకున్నవాడులేడు. జిల్లా తెలుగుదేశం నాయకులంతా ఒంగోలుకు వలస పోయివుండినారు. గండిపేటనుంచివచ్చిన జెండాలు తీసుకొనేవాడులేక ఆఫీసులోనే గుట్టలుపడిపోయాయి. ముప్పాతిక బూత్‌లలో ఎలక్షన్ ఏజంట్లులేరు. అయినా సైకిల్‌గుర్తుపై నిశ్శబ్దంగా ఓట్లుగుద్దేశారు ఓటర్లు.

కాంగ్రెసు అభ్యర్థిని కుమారి పద్మశ్రీ అదృష్టవంతురాలు. ప్రచారారంభంలో ఏ కాంగ్రెసు నాయకుడూ ఆమెసంగతి పట్టించుకోలేదు. 18 తేదీ ముఖ్యమంత్రి నెల్లూరువచ్చిపోయిన తర్వాత మాత్రమే ఎమ్మెల్యేలు రంగంలోకి దిగారు. ఆ నాలుగురోజుల ప్రయత్నంకూడాలేకుండా వుంటే ప్రమాదం జరిగిపోయివుండేది.

అసెంబ్లీ నియోజకవర్గాలవారీగా చూస్తే కాంగ్రెసుకు అత్యధికమెజారిటీ ఇచ్చినదమే

మాగుంట సుబ్బరామరెడ్డి

కాదు, ప్రాణదానంచేసిందికూడారాపూరే! 27778 ఓట్ల ఆధిక్యత లభించిందీ నియోజకవర్గంలో. చివరిక్షణంలో శ్రీ ఆనం రామనారాయణరెడ్డి కాంగ్రెసులో చేరడంతో, గ్రామాలలోని వర్గాలన్నీ ఏకమై, ప్రత్యర్థులకు ఏజెంట్ కూడా లేకుండా గ్రుద్దుకున్నారు. రాపూరు మెజారిటీఓట్లు, తెలుగుదేశంకు పోయివుంటే, పద్మశ్రీ పని ఖాళీయే.

ఆత్మకూరు మెజారిటీలో ద్వితీయ ద్వితీయస్థానం (17805) ఆక్రమించింది. బిజెపి, తెలుగుదేశంల మధ్య ఓట్లు చీలిపోవడంతో డాక్టర్‌గారి ప్రతిష్ఠ పెరిగింది. కోవూరులో తెలుగుదేశానికి అంత మెజారిటీ (7868, రావడంవిచిత్రం. తాలూకా కంటకిటి ఏకైక నాయకుడైన శ్రీ పెళ్ళకూరు ప్రభాకరరెడ్డికి గండిపేటలో విలువ పెంచుకుంది అధిక్యత. దీన్ని నల్లపరెడ్డి శీనయ్య క్రెడిట్ ఖాతాలోవేయడం తొందరపాటే అవుతుంది. కోవూరులో ఆయన కున్న పట్టు లెఫ్టినెంట్ శ్రీ కోడూరు శ్రీరంగారెడ్డి ముఖ్యమంత్రి శిబిరంలో చేరిపోయాడు. కాటంరెడ్డి వెంకటరామరెడ్డి, పోలం సుబ్బరామరెడ్డి వంటివారు కాంగ్రెసుకే పనిచేశారు. ఆయన వర్గంలో వుండి తెలుగుదేశానికి పనిచేసినవారెవ్వరూ లేరు. శీనయ్య ప్రభావం నిజంగా వుండి వుంటే, కోటప్రాంతంలో వుండాలి. కాని, గూడూరులో తెలుగుదేశానికి వచ్చిన మెజారిటీ కేవలం 8100 కోట నోరడు లిద్దరూ, తమ బంధుమిత్ర అనుచరగణ సహితంగా పోరాటం సల్పినప్పటికీ కాంగ్రెసు ఓట్లను కొల్లగొట్టలేకపోయారు.

అల్లూరులో శ్రీ విష్ణువర్ధనరెడ్డి ఇరకాటంలో పడిపోయాడు ఆ నియోజకవర్గంలో తెలుగుదేశం 8547 ఓట్ల లీడ్ సంపాదించింది సర్వేపల్లిలో శ్రీ సి వి శేషారెడ్డి అంచనాలు తల్లక్రిందులైనాయి. 10 వేలకు తగ్గకుండా మెజారిటీ వస్తుందనుకున్నారు. కానీ 4844 కి పరిమితమైపోయింది. పట్టపుపాళెంలో బిజెపి పెద్దఎత్తున ఓట్లు చీల్చడంతో కాంగ్రెసు మెజారిటీ తగ్గిపోయినట్లుంది నెల్లూరులో మెజారిటీ తగ్గడానికి (7298) కూడా బిజెపియే కారణం. రామమూర్తినగర్‌వంటి బూత్‌లలో కాంగ్రెసుకు 10 ఓట్లుకూడా పడలేదు. బిజెపికి వందల్లో ఓట్లు పడ్డాయి. తుది క్షణాల్లో రంగంలో దిగినా జెకె రెడ్డి ఆనం వివేకానందరెడ్డిల పరువు నిల్పింది.

ఎమ్మెల్యే ఎన్నికలతో సమంగా ఓట్లు రాలేదని దినపత్రికలు చేస్తున్న ఆగం అర్థరహితమైనది. దానికి, పార్లమెంటు ఎన్నికలకు సామ్యమేలేదు. అక్కడ ప్రతి అభ్యర్థి జీవన్మరణ సమస్యగా పోరాడుతాడు, ఖర్చుపెడుతాడు, అనుచరులను మోహరిస్తాడు. పార్లమెంట్‌పై ఎవ్వరికీ అంతశ్రద్ధవుండదు ఖర్చుపెట్టేవారూ లేరు అందువల్ల వాటితో ఈ ఎన్నికలను పోల్చిచూస్తే వాస్తవపరిస్థితి వెల్లడికాదు.

• • •

ఒంగోలు నియోజకవర్గంలో శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి విజయం విశేషమైనది. రాజమోహనరెడ్డికి టికెట్ నిరాకరింపబడడంతో సగంమంది కాంగ్రెస్ వాదులు పచ్చిగా వ్యతిరేకించేసినా అదృష్టంతో, 'కాయకష్టం'తో, అపరిమితమైన ఖర్చుతో నెట్టుకవచ్చి, ముఖ్యమంత్రి ప్రతిష్ఠ పెంచాడు. ఇక్కడ ఏ మాత్రం ఫలితం తారుమారై వుండినా ముఖ్యమంత్రిని ఢిల్లీస్థాయిలో కాకులుపొడిచినట్లు పొడిచివుండేవారు.

పోలింగ్‌నాటి అంచనాలకు ఫలితాలకి పెద్దతేడా రాలేదు ఒంగోలులో. మే 24 తేది జమీన్‌రైతు సంచికలో ''తక్కువలో తక్కువగా కాంగ్రెసు అభ్యర్థి 25-30 వేల మెజారిటీతో విజయం పొందుతాడని'' వ్రాశాము అన్నట్లే. 38,630 ఓట్ల ఆధిక్యత సాధించాడు సుబ్బరామరెడ్డి.

నియోజకవర్గవారీ అంచనాలు తప్పలేదు. ఉదయగిరి, కొండపి, సంతనూతలపాడులలో తెలుగుదేశం ముందు నిలుస్తుందని అంచనావేశారు. అట్లే వరుసగా 8608, 8621, 8661 ఓట్ల మెజారిటీ తెలుగుదేశానికి లభించింది, దేగా

## ఒంగోలు

| | |
|---|---|
| మొత్తం ఓట్లు | 11,08,614 |
| పోలైన ఓట్లు | 6,77,844 |
| చెల్లని ఓట్లు | 18,701 |
| **మాగుంట సుబ్బరామ రెడ్డి(కాం)** | **3,29,213** |
| దేగా నారసింహారెడ్డి (తెదే) | 2,90,683 |
| బత్తిన నరసింహారావు (బిజెపి) | 28,684 |
| స్వతంత్రులు | 15,168 |
| **మెజారిటీ** | **38,630** |

నారసింహారెడ్డిగారు ఈ మూడు నియోజకవర్గాలలో తనకు కనీసం 30 వేలఆధిక్యత లభిస్తుందని ఆశపడ్డుండినాడు కాని రాజమోహనరెడ్డి ప్రభావం అంత విస్తృతంగా ఏమీలేదు మేము ఎప్పుడో వ్రాశాము.

## నెల్లూరు

| | |
|---|---|
| మొత్తం ఓట్లు | 10,69,812 |
| పోలైనవి | 6,04,588 |
| చెల్లనివి | 16,425 |
| **కె. పద్మశ్రీ (కాం)** | **2,68,626** |
| డా. యం. నాగభూషణమ్మ(తెదే) | 2,28,769 |
| గర్జా లక్ష్మీనారాయణ (బిజెపి) | 85,806 |
| కె. రమేష్‌బాబు (జ) | 2,889 |
| జానకీప్రసాద్(బియస్‌పి) | 2,715 |
| ఎ. అబ్రహాం (ఇండి) | 289 |
| కె. మాలకొండయ్య (ఇండి) | 668 |
| పి. ముసలయ్య (ఇండి) | 805 |
| టి కోటేశ్వరరావు (ఇండి) | 508 |
| డి ఎలమంద (ఇండి) | 848 |
| ఎం. మాలకొండయ్య(ఇండి) | 1605 |
| స్వర్ణా నారయ్య (ఇండి) | 510 |
| స్వర్ణా రవికుమార్ (ఇండి) | 215 |
| **మెజారిటీ** | **44,857** |

ఈయన బలాన్ని భూతద్దంలో పెట్టి చూస్తున్నారని; అదే నిజమైంది.

కావలిలో కాంగ్రెసుకు పాతిక వేలం మెజారిటీ తెచ్చిచూపిస్తానంటుండినాడు శ్రీ

## తిరుపతి

| | |
|---|---|
| మొత్తం ఓట్లు | 10,81,046 |
| పోలైనవి | 6,47,612 |
| చెల్లనివి | 16,896 |
| **చింతామోహన్ (కాం)** | **3,91,535** |
| డా. పి. సుబ్బయ్య (తె.దే.) | 2,05,205 |
| పి. జయమ్మ (బిజెపి) | 21,626 |
| స్వతంత్రులు | 18,882 |
| **మెజారిటీ** | **1,86,330** |

---

## ఉత్తరక్రియలు

మా తల్లి

### మారంరెడ్డి ఆదెమ్మగారు

**30-5-91 తేది గురువారం స్వర్గస్థురాలైనది. వారి ఆత్మకు శాంతికలగాలని ప్రార్థిస్తూ,**

**వారి కర్మక్రతువులు**

**25-6-91 తేది మంగళవారం నిలుపు**

**26-6-91 తేది బుధవారం ఎత్తుతేపు**

నెల్లూరు వెంకటాచలపురం డోర్ నంబర్ 15/964 గల ఇంటివద్ద జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

మారంరెడ్డి రామరాఘవరెడ్డి, మారంరెడ్డి మధుసూదన్‌రెడ్డి

మారంరెడ్డి విజయ శ్రీనివాసులురెడ్డి

# కొండా శంకరరెడ్డి & మహాలక్ష్మమ్మ

## ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల

నార్తురాజుపాళెం, కొడవలూరు మండలం, నెల్లూరు జిల్లా.

ఈ విద్యాసంవత్సరము నుంచి (1991–92) ప్రారంభమవుచున్నవి.
ఇంటర్ మీడియట్ డిగ్రీ, మరియు వృత్తివిద్యాకోర్సులు (ఇంగ్లీషు మరియు తెలుగు మీడియంలలో) బోధించబడును. ఇంటర్ మీడియట్‌లో దిగువ గ్రూపులు కలవు.

**M.P.C., Bi.P.C. C.E.C. H.E.C.,**

వృత్తివిద్యాకోర్సు : 1) నర్సింగ్, 2) ఫార్మసీ, 3) ఫిషరీస్, 4) కంప్యూటర్ సైన్సు, 5) రూరల్ ఇంజనీరింగ్ టెక్నాలజీ

వృత్తివిద్యాకోర్సులలో చేరుటకు S.S.C. లో కనీసం 50% మార్కులు పొందివుండవలయును.

గమనిక : వృత్తివిద్యాకోర్సులు ఇంగ్లీషు మీడియంలలో బోధించబడును.
పై కోర్సులలో చేరుటకు దరఖాస్తులు కోరబడుచున్నవి,
దరఖాస్తులకై కాలేజి ఆఫీసులో సంప్రదించండి.

ఆఫీసు : Z.P.P. హైస్కూలు ఎదురుగా, నార్తురాజుపాళెం.

—: కాలేజీ కమిటి :—

ప్రెసిడెంట్ : ఇననాల రాధాకృష్ణారెడ్డి, యల్లాయపాళెం
సెక్రెటరి : కొండా మహాలక్ష్మమ్మ. యల్లాయపాళెం
ట్రెజరర్ : ఇరువూరు శ్రీనివాసులురెడ్డి, నార్తురాజుపాళెం
మెంబర్స్ : పాలిచెర్ల ప్రసన్నకుమార్‌రెడ్డి, మానేగుంటపాడు
తుంగా వేణుగోపాల్‌రెడ్డి, కొడవలూరు
కోడూరు గోపినాధరెడ్డి, పెమ్మారెడ్డిపాళెం
బోగోలు రాధాకృష్ణారెడ్డి, నార్తురాజుపాళెం




మంచికి మరో పేరు
ఒకసారి మాట్లాడితే కలకాలం గుర్తుండే మనిషి
గొప్ప వితరణశీలి, కార్యసాధకుడు
మహామనిషి
నామినేషన్ వేసినప్పటి నుంచి ఆయనే
గెలవాలని కోరుకుంటే
ఆయనే గెలుస్తాడని మనసు చెప్తూ ఉంటే.
ఒంగోలు లోక్‌సభ ప్రజలమీద అసూయతో
మా మాగుంట సుబ్బరామిరెడ్డిగారికి
ఈ చిన్ని శుభాకాంక్షలతో

**బిట్రా రామగోపాల్**
వాహిని ప్రింటర్స్
నరసింగరావుపేట, గూడూరు

చిన్న వయస్సులోనే
అన్ని రంగాలలో తన ప్రతిభను
నిరూపించుకొని నెల్లూరుకు గుర్తింపు తెచ్చిన

## మాగుంట సుబ్బరామరెడ్డిగారు

పార్లమెంటు ఎన్నికలలో
ఒంగోలు నుండి కాంగ్రెస్ (ఐ) అభ్యర్థిగా
ఘనవిజయం సాధించినందుకు
**శుభాభినందనలు తెలుపుతూ-**
రాజకీయరంగంలోకూడా ప్రతిభావంతంగా
వెలుగొందాలని ఆకాంక్షిస్తున్నాను.



**కలవకూరు చంద్రశేఖరరెడ్డి**
(KVR)

## నెల్లూరు పార్లమెంటరీ నియోజకవర్గం

అసెంబ్లీ నియోజకవర్గాలవారీగా పోలింగ్ వివరం

| | కాం. | తె. దే. | బి. జె. పి. |
|---|---|---|---|
| అల్లూరు | 29684 | 38181 | 8618 |
| కోవూరు | 28686 | 35968 | 11897 |
| ఆత్మకూరు | 40426 | 39621 | 20446 |
| రాపూరు | 63860 | 35082 | 10844 |
| నెల్లూరు | 37487 | 30189 | 18883 |
| సర్వేపల్లి | 38261 | 38407 | 11878 |
| గూడూరు | 39027 | 43137 | 8740 |

## ప్రతి తెలుగు ఎద

(మొదటి పేజీ తరువాయి)

తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీలలో పుస్తకాలు వ్రాశారు. విశ్వనాథవారి 'వేయిపడగలు' హిందీలోకి అనువదించిన పాండిత్య ప్రకర్ష ఆయనది. ఎన్నో సాహిత్యపరమైన అవార్డులు పొందారు. ప్రపంచస్థాయి సాహితీకారులు, వేదాంతవేత్తలు, మేధావులతో సాన్నిహిత్యం వుంది. ఏదేశానికిపోతే, అక్కడివారితో అక్కడి భాషలో మాట్లాడగలగడం ఆయన ప్రతిభకు నిదర్శనం. విదేశాంగ మంత్రిగా వివిధ దేశాధినేతలతో వ్యక్తిగత పరిచయాలు పెంచుకున్నాడు. నెహ్రూ ప్రతిపాదించిన అలీన విధానాన్ని, ఆచరణలో సమర్థవంతంగా అమలు పరచిన రాజనీతిజ్ఞుడు శ్రీ పి. వి. ప్రధాని పదవి పొందారనాన్ని, అంతస్సునకాపాడగల్గినవ్యక్తిత్వం ఆయనది. అయితే ముక్కుకు సూటిగా పోయే లక్షణం. మొగమాటం లేకుండా మాట్లాడే గుణం, కొద్దిగా హంకారంపాలు జాస్తి అయిన స్వభావం, ఆయనకు మైనారిటీ ప్రభుత్వ నిర్వహణలో చిక్కు కల్పించే ప్రమాదం లేకపోలేదు. తాను ఆధారపడే ద్వితీయశ్రేణి నాయకత్వం సమర్థవంతమైన శ్రీ పివి ప్రభుత్వ స్థిరత్వం ఆధారపడివుంటుంది. తనంత తానుగా రాజకీయ లావాదేవీలు నడిపే నైపుణ్యం ఆయనకు లేదు.

ఎట్లైతేనేమి, భారత రాజకీయచరిత్రలో తొలి దక్షిణాది ప్రధానమంత్రిగా శ్రీ పివి నరసింహారావు పేరు చిరస్థాయిగా నిల్చిపోతుంది. ప్రతి ఆంధ్రుడూ సగర్వంగా 'మావాడు ప్రధాని అయ్యాడన్న' వార్తను ప్రతిబింబించే దృశ్యం కల్పించారాయన.

* * *

ప్రధానిగా శ్రీ పి వి ఎంపిక రాష్ట్ర రాజకీయాలపైనూ ప్రభావం ఏమిటో ఇప్పుడే తెలియదు. ఎన్నిక ఏకగ్రీవంగా జరగడానికి తెరవెనుక నడచిన నాటకంలో ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి చాలా కీలకపాత్ర వహించారు. సంవత్సరంతవం వారిద్దరిమధ్య పెరిగిన సాన్నిహిత్యం, దీనితో మరింత దృఢపడుతుంది. ఆ దృష్టితో చూసినప్పుడు ముఖ్యమంత్రికి శ్రీ పి వి ఎంపిక శ్రీరామరక్ష కావాలి.

ఎన్నికల తర్వాత ముఖ్యమంత్రిపై యుద్ధం ప్రకటించాలన్న ఆలోచనతో డాక్టర్ వై ఎస్ రాజశేఖరరెడ్డి అనుయాయులు, డాక్టర్ మర్రి చెన్నారెడ్డి అనుచరులు ఎడాపెడాగా పథకాలు వేస్తూ వుండినారు. ప్రధానితో ముఖ్యమంత్రికున్న చొరవదృష్ట్యా వీరు తమ పథకాల అమలులో పెట్టలేక మరికొంతకాలం వేచివుంటారా అన్నది ఇప్పుడే చెప్పలేము. చెన్నారెడ్డిగారు మాత్రం పి వి ని మంచి చేసుకొనే ప్రయత్నంలో వున్నారు. ★

## ఒంగోలు పార్లమెంటు నియోజకవర్గం

అసెంబ్లీ స్థానాలవారీగా పోలింగ్ వివరం

| | కాం | తె. దే. |
|---|---|---|
| ఉదయగిరి | 32 698 | 36,141 |
| కావలి | 47,444 | 37 998 |
| కొండపి | 40,660 | 44,381 |
| ఒంగోలు | 61 668 | 44 768 |
| సంతనూతలపాడు | 46,851 | 50 402 |
| కనిగిరి | 50,688 | 35,512 |
| కందుకూరు | 50,860 | 41 411 |

# మూడు నియోజక వర్గాలు

(1వ పేజీ తరువాయి)

యానాదిరెడ్డి. కాని అది 24518 తగ్గిపోయింది. ఉదయగిరిలో తెలుగుదేశానికి ఆధిక్యత వచ్చినా, మాదాల జానకిరాంకు పెద్దగా చెప్పుకోదగ్గ ఎన్నికల ప్రచారంలో ఆయన తెచ్చిన ప్రతిష్ఠాంశం. ఆను బట్టి గమనిస్తే రాజమోహన్ రెడ్డితో జానకిరాం చేసినపోరాటం తక్కువైనది కాదు. జానకిరాం వ్యక్తిగత ప్రతిష్ఠగా తంటాలుపడకుంటే ఉదయగిరితో తెలుగుదేశం మెజారిటీ ఆ పైవేలు దాటివుండేవి.

మొత్తం మీద సుబ్బరామరెడ్డిగారు అదృష్టవంతుడు. రాజకీయాలలో తొలి రోజే గౌరవప్రదంగానేవుంది. ఒంగోలు ప్రజలకు ఆయన విపరీతంగా వాగ్దానాలు చేశారు. వాటన్నిండినీ నెరవేర్చాలంటే ఐదేళ్ళకాలం చాలనుగాక చాలదు.

* * *

తిరుపతిలో శ్రీ చింతా మోహన్ హ్యాట్రిక్ సాధించారు. మెజారిటీలో (1,88,805) స్టేట్ ఫస్టు రావడంద్వారా రాష్ట్రంలో ప్రత్యేక గుర్తింపు పొందారాయన.

వెంకటగిరి శాసనసభా నియోజకవర్గంలో ప్రశస్తమైన ఆధిక్యత (24,674) సాధించి తన పతి ప్రతిష్ఠను అపారంగా పెంచింది, శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి. ఈ ఎన్నికలలో ఆమె తీసుకున్నంత వ్యక్తిగత శ్రద్ధ పడిన శ్రమ జిల్లాలో ఏ రాజకీయనాడీ పడలేదనడం సత్యదూరం కాదు. రాజకీయాలలో ఏమాత్రంసంబంధంలేని ఆమెను అందలమెక్కించిన జనార్దనరెడ్డికికూడా భాగ్యంకాదు.

సూళ్ళూరుపేటలోనూ చింతామోహన్‌కు 11028 ఓట్ల మెజారిటీ సాధించి పెట్టాడు శ్రీ పసల పెంచలయ్య.

రాజీవ్ గాంధీ ఘోర హత్యవల్ల పెల్లుబికిన సానుభూతి చింతా మోహన్ మెజారిటీ పెరగడానికి కారణం.

జిల్లాలోని మూడు నియోజకవర్గాల ఫలితాలపై సంక్షిప్త పరిశీలన ఇది! ★

## తిరుపతి పార్లమెంటు నియోజకవర్గం

అసెంబ్లీ స్థానాల వారీగాపోలింగ్ వివరం.

| | కాం. | తె దే | బి జె పి |
|---|---|---|---|
| సూళ్ళూరుపేట | 44, 444 | 33, 416 | 8, 280 |
| వెంకటగిరి | 55 042 | 30, 368 | 2, 987 |
| శ్రీకాళహస్తి | 66 054 | 32. 080 | 8, 264 |
| పుత్తూరు | 58 056 | 29, 702 | 2, 332 |
| సత్యవేడు | 56, 614 | 27, 388 | 2, 376 |
| తిరుపతి | 59, 321 | 23, 368 | 8. 524 |
| నగరి | 67, 141 | 29. 083 | 8, 289 |

## సుజనుడు

(4 వ పేజీ తరువాయి)

కృషి చేసి పోలేదు కాని, ఆ జాతీ నెల్లూరు పార్లమెంట్లో కూడా విన్పించదు.

ఒంగోలులో గెల్చిన మాగుంట సుబ్బ రామిరెడ్డి గురించి ప్రచారాలు అవ సన లేదు అది అమ్మ పుట్టింటి ఘనతను మేనమామదగ్గర పెరిగినట్లు వుంటుంది. ఆయన శక్తిసామర్థ్యాలు అందరికీ తెలిసినవే. తండ్రి చేతిలో పెట్టి వెళ్ళిన మామూలు వ్యాపారాన్ని, [illegible] భారత దేశంలోనే అగ్రస్థానంలోనే ఆయన ప్రపంచ లోకానికి రావడమైనది. ఎమ్పీ అనేది, సుబ్బరామిరెడ్డికి అదనపు అర్హత అవ్వచ్చు, అదే విలువ కాదు, పేరు చివర ఆ రెండక్షరాలు లేకపోయినా కేంద్రంలో, రాష్ట్రంలో మంత్రులను, కార్యదర్శులను ముఖ్యాతి మందిని 'హలో' అనగలరు; అన్పించుకోగలరు.

నెల్లూరు లోకసభ సభ్యురాలు కుమారి కుడుముల పద్మశ్రీ రాజకీయాలకు పూర్తి కొత్త. అయితే ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి అభ్యర్థిగా ఆమెకు రాష్ట్రంలో కేంద్రంలోకూడా ప్రత్యేక గుర్తింపు లభిస్తుంది. చదువుకున్న యువతి కావడంతో భాషాసమస్య పెద్దగా ఎదురుకాకపోవచ్చు. గ్రాడెన్స్ ఇవ్వడానికి శ్రీ పసం పెంచలయ్య ప్రక్కనేవుంటారు. రాజకీయాలకు కొత్త కావడంతో అనుచరులులేరు, ప్రత్యర్థులు లేరు, అభిమానులులేరు. ఆపని, ఈపని చేసిపెట్టమని వెంటబడేవారులేరు! ప్రజలందరికీ ఉపయోగపడేపనులుచేయదలిస్తే, ఐదేళ్ళ కాలమంత సావకాశం దొరుకుతుంది. తీరిగ్గా ఆఫీసులో కూర్చొని ఫైళ్ళు కదిలించవచ్చు, అధికారుల దగ్గర తిష్ఠవేసి ఆర్డర్లు వేయించవచ్చు.

ఢిల్లీస్థాయిలో నెల్లూరుకు జరగవలసిన పనులు చాలాచాలా పెండింగులో వున్నాయి. నెల్లూరుకు తిరుపతి, అనంతపురంలవలె ఎఫ్. ఎం. రేడియోస్టేషన్ కావాలి. మహానాయకులిందరుండీ నెల్లూరుకు రేడియోస్టేషన్ లేకపోవడం అన్యాయం. విమానాశ్రయం సరేసరి. ఎక్కేవారు, దిగేవారులేని కడప, రాజమండ్రిలలో విమానాశ్రయాలుకట్టి మూతవేశారు గాని, రోజుకు రెండువిమానాలు నడిపినా టిక్కెట్లకోసం క్యూలో నిల్చునే నెల్లూరీయులకు ఆ అవకాశం లేకుండాచేశారు.

నెల్లూరుజిల్లాలో ఓ.ఎన్.జి.సి కార్యక్రమాలు విస్తృతం కాబోతున్నాయి. మద్రాసు ప్రక్కనే వుండటంతో. అక్కడినుంచే [illegible] నడుపుతున్నారు. ఇట్లా కాకుండా వారి ప్రాంతీయ కార్యాలయం నెల్లూరులో పెట్టి తీరాలి. శ్రీహరికోట రాకెట్ కేంద్రంలో ఉద్యోగాలకు విలువ [illegible]; వాటిని సముపార్జించి పెట్టాలి. [illegible] పథకాలకు నిధులు తేవాలి. కనీసం ఒక్క [illegible] అయినా నెల్లూరులో [illegible] ప్రతిపాదించిన [illegible] కేంద్రం [illegible] గులో పడిపోయింది దాన్ని వెలికి తీసుకొనిరావాలి. అన్నిటికంటే ముఖ్యమైనది కృష్ణాపట్నం ఓడరేవు.

ముగ్గురు ఎమ్పీలూ మనసుపెట్టి పని చేస్తే వీరితో అసాధ్యమైనదేదీలేదు ★

## సింహపురి

(4 వ పేజీ తరువాయి)

తంగా వారు క్లాసులు ఎగ్గొట్టి తిరిగేస్తున్నారు. ట్యూషన్లు లేని పిల్లలకు దీనివల్ల బాధాయిర్పంది. ఈ సమస్యలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని శ్రీ స్వామిదాసు తల్లిదండ్రులకు జాబులు వ్రాశారట. అయితే స్కూలుకు పంపండి, లేదా ట్యుటోరియల్స్ లో చేర్పి ప్రైవేటుగా పరీక్షలకు పంపండి అని! కొందరు తల్లిదండ్రులు ఈ పరిష్కారమును ఒప్పుకున్నట్లున్నారు. కొందరుమాత్రం [illegible] పని పట్టుబట్టారట. [illegible] వారందరికీ టి. సి. లిచ్చి పంపేశారు. దీనితో రభస మొదలైంది. యూత్ [illegible] పేరుతో అల్లరిమూక ఒక రోజు [illegible] స్కూలుపై దండయాత్రచేసి, టీచర్లను బెదిరించి, పిల్లలనుకొట్టి నానాయాగీ చేశారట. పాపం టీచర్లు భయపడిపోయారు.

నెల్లూరుటౌన్లో మధ్యతరగతి కుటుంబీకులకు అందుబాటులో వుండికూడా కొత్తమేర విద్యా ప్రమాణాలు కాపాడుతూ నడుస్తున్న కొద్ది స్కూళ్ళలో స్వామిదాసు స్కూలు ఒకటి. ఫర్తు వ్యాపారధోరణి అలవడనందువల్లనే ఇరవయ్యేళ్ళ తర్వాత కూడా స్కూలు వున్నది వున్నట్లుగానే వుంది. నిన్నగాక మొన్న వచ్చిన విద్యాసంస్థలు విద్యాహకులకు కోటీశ్వరులైపోతుంటే, స్వామిదాసు మాత్రం ఆ పాత పాకలోనే వుండిపోతున్నారు. అటువంటి స్కూలును భ్రష్టుపట్టించడం అన్యాయం. ట్యుటోరియల్ సంస్థలు చేసే అన్యాయాన్ని పిల్లల తల్లిదండ్రులే పూనుకొని నివారించాలి ★



# కృతజ్ఞతాంజలి

## ఇది ప్రజల విజయం!!
## రాజీవ్ ఆశయాలకు జయం!!



నన్ను తమలో ఒకడిగా పరిగణించి,
ప్రేమానురాగాలతో ఆదరించి,
నామీద అపరిమిత విశ్వాసం ఉంచి,
నన్ను అత్యున్నత చట్టసభకు తమ ప్రతినిధిగా ఎన్నుకున్న

## ఒంగోలు లోక్‌సభ నియోజకవర్గ ప్రజలకు

నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు !
ప్రజలు నామీద ఉంచిన నమ్మకం వమ్ము చేయననీ,
ఆ ఆదరాభిమానాలే స్ఫూర్తిగా, నియోజకవర్గ
సర్వతో ముఖాభివృద్ధికి అవిశ్రాంతంగా కృషి సాగిస్తాననీ,
దివంగత నేత స్వర్గీయ రాజీవ్ గాంధీ కలల సాఫల్యానికి
నావంతుగా పాటుపడతాననీ వినమ్రంగా
ప్రమాణం చేస్తున్నాను.

**మాగుంట సుబ్బరామరెడ్డి**
ఒంగోలు లోక్‌సభ సభ్యులు

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press-Nellore.